శ్రీరస్తు.

# కవిప్రశంస.



కం॥ అనుభవరసిక సమన్వితు। ననుగుణముగ రెండొ మూఁడొ యెనుఁగంటలలో। వెనుక గవరశేఖరకృతిఁ జె। ప్పిన రాజామణికి సుకవి బిరుదొసఁగఁ దగున్॥

శా॥ వ్యాయామంబుల రాజఖేలనములన్ వాక్యోపపత్త్ర్యాదులన్। భూమౌ నైపుణి మొందిసద్రసికతాభూమాంతరంగాఢ్యుఁడై। మాయాతీతసువృత్తిచే విబుధల సమ్యగ్జ్ఞాని రాజామణీ। శ్రీహూనామ కవీంద్రుఁడొప్పు విబుధశ్రేణీమనోహ్లాదియై॥

శ్లో॥ సత్యాహింసానసూయా ప్రియవచనసదోల్లాసనసంవర్ధమాన। శ్రీమాదార్యత్వమాద్యైః ప్రథమగణిత సౌంపాత్రిపణీహోబుధేంద్రైః। ఆనందేంద్రప్రజానా ముదరతరురివ పాత్రిప్త రాజాపతారః। పాయాదాశ్రీ నిత్యాముపహృతికవనం మర్త్యనారాయణాంశః॥

10-5-96 } ముడుంబై నరసింహాచార్యులు,
విజయనగరము. } సంస్థానపండితులు.



శ్రీ కాత్యైనమః.

# రామకథాకరండము.

కం॥ శ్రీవనితామానసరా
జీవమధువ్రతుఁడు సకల జీవాధారుం
డావిష్ణుఁ డెల్లవేళల
శ్రీవేంకటరమణమూర్తిఁ గృపనేలు నిలన్. 1

కం॥ సౌరభుజిష్యులతోడను
వారాన్నిధిఁ దోఁచిన రమ వారక ప్రోచున్
ధీరలలిత గుణకలితు బు
ధారాధ్యుని వేంకటరమణాభిఖ్యవిభున్. 2

కం॥ గిరితనయా హృదయేశుఁడు
సురనక్తంచరనుతుండు శూదాద్రిచరుం
డురగాభరణుఁడు మను బా
కురుపండాన్వయ పయోధి కువలయమిత్రున్. 3

కం॥ మేనానీహారగిరుల
మానసమిగు రెత్తఁదోఁచి మదనాంతకుసా
మేనుగొనిన సాధ్వీమణి
మానుగరక్షించుఁగాత మత్కృతి వేతన్. 4

కం॥ సనకసనందన ముఖస
న్మునిలోకనుతుఁడు విరించి మోదాత్మకుఁడై
మనుచుత బాకురుపండా
ఘనవంశసుధాబ్ధివిధుని గావ్యాధిపతిన్. 5

కం॥ సంగీతము సాహిత్యము
పొంగుకుచద్వయముగాఁగఁ బొలుపునుగను వా
గంగన వేంకట రమణవి
భుం గరుణాదృష్టి మనుత బుధులొసనఁగాన్. 6

కం॥ గిరిజతను వాఁకిలనిడి పి
తరంబులాహుతజిత శివుఁడుచను దేరరణం
బురుగతి నిలిపిన గణపతి
కరుణామతి శుభములొసఁగి కాఁచుఁ గృపతోన్. 7

కం॥ శ్రీనగతనయా వాణీ
జానిజనని నగ్నిసూర్యచంద్రాక్షుని ని
త్యానందఖనిసిగాళిని
ధ్యానింతు నితాంతభక్తి యహరహమొసఁగన్. 8

కం॥ శ్రీవిజయనగరపతిని సు
ధీనుతానంద గజపతిని సకలకళా
ధీవిజితవిధిని మద్గురు
భావింతునిరంతరంబు భక్తి దలిర్పన్.

క॥ బుధనుతు రత్నబలిజకుల
సుధాబ్ధివిధు సత్యచరితు సూరిందుప్రియశో
కధినంగనాహృదంబుజ
మధుకరుగోపాలకృష్ణు మత్పితనెంతున్. 10

క॥ శివకేశవ భక్తులకును
గవివరులకు సాధువులకుఁ గవితారసముం
జవిచూడం గలసతులకు
నవిరళతర భక్తినతుల ననయము నొనర్తున్. 11

క॥ అనియిష్ట దేవతాదిక
వినుతులు గావించియొండు విమలచరితవాఁ
కొనఁగాఁదలంచు నత్తటి
ననఘుఁడు తియ్యూరి శంకరాగ్రణిమైత్రిన్. 12

క॥ ననుఁగాంచి కాళిదాసా
యనయము నీయాశుకవిత నగ్గింతుబుధుల్
జననుతమగు రామచరిత
ఘనతరమధురోక్తి టూకిగాఁబలుకుమిటన్. 13

క॥ ఘనయశుఁడగు నామఁ జదికి
నను ముగఁగృతియిచ్చిపలుకుమని తనచిఱున
వ్వెనయంగా వితరణబలి
మనసిజమూర్తి యతఁడాడ నౌకొనివేడ్కన్. 14

క॥ శ్రీరఘునాయక చరితం
బారూఢిగఁ బలుకు వాన నఘహరణముగా
ధారుణిని సీతాపతి
చారిత్రముఁబలుకువాఁడ శంకరనుతిగాన్. 15

క॥ ధరణీస్థలి బ్రహ్మకులము
చిరతరగౌరవముగలిగి చెలువొందుఁగదా
సురవందితమైయట బా
కురుపండాన్వయము వఱలుఁగువలయమలరన్. 16

క॥ బాకురుపండాన్వయమున
భూకాంతులు ధీరతులు సుభోగపరులు లో
కైకయశులు శోభిలిరట
జ్యాకాంతుఁడనిందితాత్ముఁ డాదప్పదగెన్. 17

క॥ అంకరహితాత్మవకు నక
ళంకయశోధికి నఖలకళావార్నిధికిన్
వేంకటరాయ విభుండును
శంకరనామప్రభువును జన్మించిరొగిన్, 18.

క॥ శంకరుఁడొకించుకయేలా
శంకరుఁడే యవతరించె జగతినటంచున్
గొంకకవిబుధులు పేర్కొన
శంకరవిభుశేఖరుండు పట్యూర్తిగానెన్. 19

క॥ అతఁడు వలియందుఁ గనియెం
గుఱుకొన్న దానధర్మ గుణధుర్యుఁ బలి
వ్రతశాంతి హృదయ ధీయుత
నతులిత హిత వాగ్విలయ మహాలక్ష్మమ్మన్. 20

క॥ ఆరమణీమణి వెనుకొని
వీరుఁడు వేంకటరమణయ విభుతల్లజుఁడున్
నారాయణశతబస్తీన
తీరత్నంబు దయమైరి తేజోధనులై. 21

క॥ కృతిపతి వేంకటరమణ
క్షితిపతి యటులుద్భవించి చెలరేఁగుజగ
న్నుతి వానాటికిఁ గనుచును
ఋతవాక్యవిభూతిఁ గొనుచు హితులఁ బనుచుచున్

క॥ సరసప్రసైరుఁడు సుగుణుఁడు
శరభవశౌర్యుండు గాన సాహిత్యకళా
శరనిధిమంథముఁడని బా
కురువంశవతంసు బుధులు గొలుతురు వేడ్కన్. 23

క॥ అతిరమణీయాకృతి స
న్మతి నాదృతిఁ గీర్తి శాంతి మల్లనుతబలో
న్నతి నానావిధవిద్యా
రతి వేంకటరమణమూర్తి ప్రతిగలరె క్షితిన్. 24

క॥ రామాకృతిఁగని మాని
స్తోమముదమిగొనియెననెడి చోద్యపుమాటల్
భూమిఁదగ వేంకటరమణ
నామకవిభుఁడుద్భవించి నయయశముగొనన్. 25

క॥ మనుసుడుగాఁడా పరిబా
ణుని వాఁకిటనుండెననెడి నుడి యశమిదు నా
ఘనుఁడువిభూత్తముఁ డాతఁడు
దనసేవికిఁబనులు సేయు దయనెట్టిదొకో. 26

క॥ అనిలునకు నోఁచినట్టిఁడు
వనమాలిని మోయునట్టి వాఁడతిశాంతిన్
గొనుటబ్రమెయని శేషుని
వినుతింపరు వీరునతఁ వీక్షించుబుధుల్. 27

క॥ పరలాభ మెంచికర్ణుఁడు
హరికి సమర్పించెఁగవచ మదియొకపేరే
వరహరికి సహజవితరణ
గరిమనునిజహృదయ మొసఁగె ఘనుఁడతఁడుభళీ. 28

క॥ చంద్రుని సత్కీర్తిహరి
శ్చంద్రుని బుధవాగ్విభూతి శాంతినిఫణిలో
కేంద్రుని మనోహరాకృతి
నైంద్రునిబొమ్మనుచుఁ జిమ్మనతఁడసదృశుఁడై. 29

క॥ తనుఁజంపువారికైనను
గినియఁడు తనవారి నీచకృత్యములు మనం
బుననిడఁడు నొంచఁడేరిని
ఘనుఁడిల బ్రహ్మర్షియనఁగఁ గాంచెనహారే. 30

క॥ ఆతని నిర్మలసుగుణ
వ్రాతమునిల నభినుతింప వశమావిధికిన్
ఖ్యాతిప్రదుఁడు వదాన్యుఁడు
నీతివిదుఁడు ధీరతుండు నృపవరుఁడౌరా. 31

క॥ రారాజద్గుణునిసుగుణ
వారంబఖిలాశలందు వర్ణితముగదా
కారుణ్యాత్మునకు మహా
దారునకు మదీయహృదయ తాపఘ్నునకున్. 32

క॥ శ్రీకలితాత్మసదనునకు
బాకురుపండాన్వవాయ పాథోనిధితా
రాకాంతునకు వనీపక
లోకస్తవనీయకీర్తి లలితాశునకున్. 33

క॥ కంముకపల్లాదికళా
వందితహృత్పయోజమునకు నానాకవివా
గ్వందితధీమండనునకు
సుందరతర దేహవిజిత సూనాస్త్రునకున్. 34

క॥ భూవందిత కీర్తి దనకు
భావభవాకారునకు విభాసిర్జితరా
జీవాప్తునకు దయాబ్ధికి
శ్రీవేంకటరమణమూర్తి పృథివీపతికిన్. 35

క॥ అర్పించి రామచరితము
నర్పంగఁదొడంగి వాఁడ నైమిశవనివా
గ్దర్పమున రౌమహర్షణి
యోర్పుగలిగి శౌనకాదులూఁకొనఁబలికెన్. 36

క॥ నళినాప్తవంశతిలకుఁడు
గళితాఘుఁడు రఘుఁడువసని గాఢతపంబున్
నళినాక్షుఁగూర్చి సలిపెను
దళితాసురుఁడాత్మజుఁడయి తనకుజనింపన్. 37

క॥ హరియంతఁదోఁచి రఘువుం
బరికించి నృపాత్మదీయ పుత్త్రునకు నిశా
చరవధకుజనించెదనిఁకఁ
బురికింజనుమనివచించి పోయెను స్వేచ్ఛన్. 38

క॥ ఆజనపతి సుతుఁడగు నజ
రాజమణికిఁ బుట్టిన దశరథుఁడు సుగుణలన్
రాజతనూజల ముగురవి
రాజితగతిఁ గాంచెనమర రాజ్ఞిచెలంగన్. 93

క॥ ఆరంజోతి పతిదయఁగు
మారేష్టియతండొనర్చి మహితాత్ములవి
ద్యారతుల శస్త్రనిపుణుల
నారూఢశరీరుల సకలాహవజయులన్. 40

క॥ బలభేదిభయవిదారుల
లలితయశుల రామభరత లక్ష్మణశత్రు
ఘ్నులఁ గౌసల్యాదిసతీ
లలామలందఁ గనె హర్షలాలసుఁ డగుచున్. 41

క॥ గాధేయుఁ డంత రాక్షస
బాధితుఁడై యరుగుదెంచి పఙ్క్తిరథునిసం
బోధించి రాములక్ష్మణు
సాధించుకొనిచనియెఁ దన సవనముదీర్పన్. 42

క॥ చనుచోఁ దాటకపైకొన
ననవంశవతంసుఁ డలిగి యిషుతతిదానిన్
మనిమి సుబాహుఁ గసిమసఁగి
వనధిని మారీచుఁ జేర్చె వర్ణ్ణమతింపన్. 43

క॥ సీతాస్వయంవరము హల
కేతుఁడు చాటుటవిని మునికేసరి నృపసం
జాతులతో నటకునడఁచెఁ
నాతురగతి రాముఁడప్డహల్యను మనిచెన్, 44

క॥ గౌతమఘటజాశ్రమములఁ
ప్రీతివసించి మిథిలాపురికి మునురరుగన్
భూతలనాథుం డందఱఁ
జేతఃప్రమదంబెసంగఁ జేకొనియెడఁగన్. 45

క॥ హరచాపమంత జనకుం
డు రామునకుఁ జూపనతఁడ నూన బలమునన్
ధరణీయవర దానివిఱిచె
ధరణిజయి డెఁ బుష్పమాల దాశరథి మెడన్. 46

క॥ రాముఁడు సీతఁగొని పరశు
రాముని భంగపఱచి తనరాజ్యముఁ జేరం
గా మంథర బోధనవిని
తామసమున భరతజనని దశరథుతోడన్. 47

క॥ తనవరము పేర్మిభరతున
కును రాజ్యమొసంగుటయును ఘోరారణ్యం
బున నుండ రామునంపుట
యును గోర్కియటంచు నాడె నొడయఁడు వనర

క॥ కైకయభీష్టంబారసి
సాకేతపురంబువదలి సౌమిత్రియు సీ
తాకాంతయు వెనుకొనిరా
లోకోత్తరయశుఁడు రఘుకులుఁడు వడిఁజనెన్. 49

క॥ తహతహపడుచును గంగను
గుహుండు దరియింపఁ జిత్రకూటాఖ్యవనిక
మిహిరాన్వయుండు బసకొనె
మహీకుమారీమృదూక్తి మధుపూరార్పన్. 50

క॥ లోకజనని జనకాత్మజ
తోఁకొనుతఱిఁగని విరాధి దోసమున కహో
కాకాకృతిని జయంతుం
డాఁకెపయినివ్రాలె నింతయాసదొలంగన్. 51

క॥ ఆకీచకకృత్యము నిలా
జానికనికడిందికినుక సాయకమును గ
న్నోబ్నే సెఁగాకములకు న
హా నేత్రమొకండుమఱఁగె నాహేతువునన్. 52

క॥ అట విగతాసుండయ్యెను
గటకటపడి దశరథుండు కైకేయిసుతుం
డటునిటుదోఁచ కయోధ్యా
కటకంబునుబాసి రాముఁగని మొఱపెడెన్. 53

క॥ జనకుమృతి రాముఁడారసి
పనరిజలక్రియలొనర్చి భరతునకును బో
ధన చేసి యనిపి తాభృగు
మునిశోభవిభీత విపినమునకుం జనియెన్. 54

క॥ నరభోజవిరాధుఁడు నిమి
శరభంగు సుతీక్ష్ణుఁడత్రి సాఁగిలపడి యి
త్వరిజంబుజననిఁ దజిమి
ఖరదూషణముఖులను రఘుకాంతుఁడు గూల్చెన్. 55

క॥ రావణుఁడు శూర్పణఖయనఁ
గావైదేహిని గొని చనఁగా మారీచుఁ
గైవశము చేసుకొనితొర
గావచ్చె రఘువరుఁడున్న కాననమునకున్. 56

క॥ మారీచుఁడంగఁ గాంచన
సారంగాకృతిని బర్ణశాలయెమరసం
చారము సేయ విదేహజ
మారికహరిణంబుఁగోరి మగనింబనిపెన్. 57

క॥ శంబరముఁజంపె రాముఁడు
సంబరమున రావణుండు జానకిఁగొని పో
వెం బుడమి బుడుతరవణము
లంబరమునఁ గట్టివైచె నటుచనుచుపగన్. 58

క॥ తను నెమకు లక్ష్మణునితో
వినవంశ్యుఁడు పర్ణశాల నేగిజనకజన్
గనకటుసటు తిరిగి శంభం
ఘునిదునిమి జటాయు దెలుప దుఃఖతుఁడయ్యెన్. 59

క॥ అతిశ్రమిడిన శబరికిఁ
గౌతుకమిడి పంపఁజేరి కమలాప్తసుతున్
వాతసుత మైత్రిఁజేకొని
యాతనిరిపు వాలి దినకులాగ్రణి కూల్చెన్. 60

క॥ అంతటఁ బ్రావృట్కాలా
నంతరమునఁ గపివరుండు నగచరులను సీ
మంతిని వెదక ననిపె హను
మంతుఁడు సంపాతివలన మార్గమరసి తాన్. 61

క॥ సురసాసింహికలు బెదర
హరిణతురగవేగ మలర నరులవర నవా
క్నరఃధిని దాటి లంకను
బరిమార్చియశోకవనిని భామినిఁగనియెన్. 62

క॥ కనినృపు ముద్రయొసఁగి దీ
వెనగొని యక్షయుని దులిచి విశ్రవసుతనూ
జుని సభఁజని లాంగూలా
గ్నిని లంకదహించె నాంజనేయుఁడు గడిమిన్. 63

క॥ మఱి నీర్వాధి నెగసి యం
గదఁబురికొని యనువు మధువనముఁ జూఱగొనెన్
గొఱగాని సేఁతలెంతురె
యఱిముఱిమూరిఁజను సుజనులైవనచరులే. 64

క॥ దాశరథివిక్రృతరూపు వి
నాశంబొనరించ వీరనక్తంచరులన్
కౌశికమహర్షి దత్తమ
హాశుగములఁ బీవమఁడంచె నగచరులార్వన్. 70

క॥ దశవదనుఁ డంత నుగ్రత
నశనిసమానాస్త్ర వితతి నరకాన్వయులన్
కృశియింప నేయరాముఁడు
దశదిశలొనరద మొందఁ దలలను దునిచెన్. 71

క॥ తలలఁదునుమ నవితోద్ధో
మొలుచుటగని రాముఁ డబ్రమునుగొనిదర్పో
జ్వలితుఁడయి నేలఁగూలిచెఁ
బలలాశన వంశతిలకు బ్రహ్మాస్త్రమునన్. 72

క॥ మయతనయాహృదయకుశే
శయమధులిడ్వరుఁడనరత జటికిలఁబడినన్
జయజయరవములు సెలఁగెను
వియత్తలమ్మున నితాంతవిబుధోత్సవమై. 73

క॥ హతశేషు లంతలంకకు
ధృతిచెడిపాతిమయసుతకుఁ దెలిపిరవగనా
సతితికమకయనుచరణ
క్షితిలనివిశ్వసపిభునిఁ జీటుబునేడ్పెన్. 74

క॥ హరుఁ బూజించిన రావణ
శిరములు గృధ్రముల క్రిందఁ జేశాకున దెవ్
దరణీపధిక్కృతమాపఁగ
ధరణింగాఁగలవిధికాక తప్పునెయకటా. 75

క॥ వేదవతియు శాండిల్యుఁడు
సోదరసుతుఁడు శపియింపఁ జూడవ్రక్కిడున్
గాదనక సీతఁగొంటివి
నీదుపరాక్రమము బ్రుంగె వెలతలవలనన్. 76

క॥ వీతధృతిఁ గార్తవీర్యుని
చేతం గారాగృహంబుఁ జేరితివిపుడీ
సీతాపతి చేఁబడితివి
హాతప్పదె దైవలీలత మతిశౌర్యనిధీ. 77

క॥ అని మండోదరి వాపో
యినను విభీషణుఁడు నృపతియిష్టానుమతిన్
జని యన్న నగ్నిఁ జేరిచి
తనవదినను భార్యగా ముదంబునఁ గొనియెన్. 78

క॥ జనకజఁ గొని రాముఁ డయో
ధ్యను జేరెఁ గుబేరపుష్పకారూఢుండై
జనయిత్రులు హర్షింపఁగ
ననుజులు సఖులుం బ్రజ లుపహారమ్ములొసఁగన్, 79

క॥ మంతుగ వసిష్ఠు నానతి
నంతటఁ బట్టాభిషిక్తుఁడై సతితోన
త్యంతసుఖ మొందె రాఘవుఁ
డింతియు గర్భంబుదాల్చె నినరుచులలరన్. 80

క॥ రజకుఁడట సతికి రేయిని
నిజపత్నిని నాడినట్టి నీచోక్తులు భూ
మిజయుఁ డెఱిఁగి యమితమనో
రుజ మైథిలినని పె వనికిఁ గ్రూరులు రాజుల్. 81

క॥ సీరధ్వజాత్మజ మునీం
ద్రారామమునందు నంగలార్చుచునుఁ డెఁగా
గారుణికోత్తముఁడు నిరా
బారిమగం డెఱిఁగి దుఃఖపరవశుఁడగుచున్. 82

క॥ వేపుత్త్రేంది సతికిమః
ఖోపశమముఁ జేసి తొంకి నుండఁగ వేడెన్
భూపుత్త్రియు నీఁకొనియటఁ
గాపుర మొనరించెఁ బారికాంక్షి సతులతోఁగా. 83

క॥ సౌమిత్రి నానుజాశ్రమ
సీమను గర్భిణిని దిగచి చింతనుమరలెఁ గా
రాముఁడు పొగలె సతిఁదలఁచి
హోమనుపలమదులు తాలువ హరునకు వశమా. 84

క॥ అంతశుభలగ్నమున నా
కాంత కుశలవులను యమళఁగనె వాల్మీకి
స్వాంతము వికసింపఁగ దిన
కాంతుఁడు కులవృద్ధిఁ జెందెఁ గదయని తనియన్. 85

క॥ కందుకమల్లాసికళలఁ
గాండపరిశ్రమమునందు ఘనతంత్రములన్
దండిమగలుగా నెదుగుచు
నుండిరి వల్మీకభవుని యొద్ద నృపసుతుల్. 86

క॥ మానిత యశుండు కౌస
ల్యానందనుఁ డశ్వమేధ యాగము సలుపం
గా నెంచి హయము నవనిప
స్థానుమతిని విడిచె లోకమందుఁ జరింపన్. 87

క॥ నానాస్థళులఁ దిరిగి యా
జానేయము వాయుజవని చాయను ధాయన్
జానకిసుతులది గట్టిర
మానుషవిక్రమము మెఱయ మహిమ ముదమెనయన్.

క॥ తురగాంగరక్షకుండై
యరిగినశత్రుఘ్నుఁడంత నాబాలకులన్
బరిపరివిధములఁ బలికిన
సరకుగొనమిఁ జూచి యుద్ధసన్నద్ధుండై. 89

క॥ శూర్పరాంబకముల నొందిన
వారుగ్రత నేసియతని వసుధాస్థలిపైఁ
జేరిచిన లక్ష్మణుఁడు సని
ఘోరాహవ మాచరించి శూలెనయారే. 90

క॥ భరతుండంత నచటఁజని
ఖరకరమూర్తుల నిరువురఁగని ముదమారన్
సరసోక్తులు పచరించినఁ
బరుషములాడుచును వారు పైకొనికినుకన్. 91

క॥ వివిధాస్త్ర వితతినాతని
సువర్మమునుజించి నేల గ్రుక్కిండిరి రా
ఘవుఁడదివిని ఘనచింతా
వివర్ధమాన హృదయాబ్జవికలితుఁ డగుచున్. 92

క॥ లంకేశ రుమావరులిరు
వంకలఁడగజాంబవద్భవనభవముఖులా
తంకముగనక నడువఁగద
నాంకమునకుఁ గదలివచ్చి నచ్చనినఢంకన్. 93

క॥ రాముని వైభవజితసు
త్రాముని గట్టికుశలవులవుడా యాతని సం
గ్రామమున జయించినఁగద
భూమియు శంభొదవునంచుఁ బొంగులుగులుకన్. 94

క॥ సేనఁబడి శిలీముఖ సం
తానములను రాఘవుఁడక్కఁ దక్కినవారిన్
భూనతులుగఁ జేయఁగ వసు
ధానాథుండడిగె వాంఛ తల్లిం బంచన్. 95

క॥ బాలకులు సార్వభౌముని
లాలితమధురోక్తులకుఁ జెలంగి సీతయునం
గాళిజనని పితయెంతఁడో
హేలామాటలని వింట నెక్కిడిరి ముడిన్. 96

క॥ ఆమాటలు చెవిసోఁకిన
భూమీశుఁడు మూర్ఛఁబొందె భూషాభరణ
స్తోమమును జాంబవంతుని
సామీరిని గొనుచువారు సని రిలుసేరన్ 97

క॥ సీత పతిభూషలంగని
హా నందినీబంపివారె యని యెలుఁగెత్తన్
వాతాత్మజు వలనఁదెలిసి
యాతురగతి నాఁటుజుఁడు రణావనికిఁజనెన్. 98

క॥ చని ముని తనయోగమహిమ
వనుజహితభట సహితముగ నానృపుఁ లేపెన్
మనుజపతియు మస్కరికిని
ఘనభక్తిననుస్కరించెఁ గాశ్యపియులరన్. 99

క॥ అంతఁ దపోధనుఁ డనుపఁగఁ
గాంతామణియుతముగాఁగఁ గటకంబునకున్
సంతసమునఁ జని యధ్వర
మెంతయు సాఁగించె రాముఁ డిద్ధయశుండై. 100

క॥ ఈ రేడు జగంబులఁ దన
పేరేపారన్నృపుఁ డేలెఁ బృథివీతలమున్
వారదుఁడట వైకుంఠముఁ
జేరంజని లక్ష్మిఁ గాంచి చేమోడ్పి యనుగా. 101

క॥ అంబా మారిపురానిసరూ
పంబా మోఖుట్టులన్నచుఁ బలుక జలువశ
క్యంబా కనఁ దగునదివా
గ్డంబరమును గలయనెఱపి కర్ష్మంఠిచనెన్. 102

క॥ సిరితనదర్మసతీమణిఁ
బరికించి చెలీ మదీయ భర్తయయోధ్యా
పురి నేలుచు నుండునుగద
దరిఁ జనకజ మాయఁబన్ని తోడ్కొని రమ్మా. 103

క॥ వాల్గుఁ గుఁ జేడె యయోధ్యకుఁ
దీవరముగ రామతమ్మతీరునఁ జని ల
క్ష్మీ భుఁగీరాకృతి మా
యా వైశీరి మార్చి తెచ్చె యద్ధిన మెచ్చన్. 104

క॥ శ్రీరాముఁడు వైకుంఠ
ద్వారమునఁ బ్రవేశమునుఁడుఁ దనరూపుగొనెన్
శ్రీరామ హేమ పాత్రను
నీరము గొని తెచ్చెఁ జరణనీరజములకున్. 105

క॥ రాముఁడదిగాంచి హాపర
ఖామవ్రతగదిష్టులనుచుఁ బరుషోక్తులచేన్
గామాంధత లక్ష్మి నిజ
స్వామిని మోహగుహాసంటు వారక కసరిపెఁ. 106

క॥ తనుఁగౌఁగిలించిన కమలఁ
గనిసికయిుఁదో ప్రిస్వైది క్షితి జారిణివై
జనియింపుమని శపించెను
జననాథుఁడు పూర్వదృష్టి చాలదు కతనన్. 107

క॥ పరస్త్రీ వ్రతుఁడాతం
డాకలశజమోహితనయు యనన్యాంగనగా
లోకాపవాద మెంచుచు
వీఁకం బడఁదోసి తిట్టె వీడిడివారెన్. 108

క॥ ఆలింగన సుఖమివ్వక
బాలిశుఁడై తిట్టెననుచుఁ బతిదశపించన్
జాలిఁ గలిమికోమలి తన
యాలిని మైథిలిని బాసి యలయికపడఁగాఁ. 109

క॥ అటుదిట్టి భావి భవమున
పిటవృత్తిఁ గోమమది పక్ష్మ విభునిశపించెన్
గటకట కాంతాళముగోను
కుటిలాలకలరయువారె గుణదోషంబుల్. 110

క॥ అంతసఖిమాయ నిజనిగ
మాంతఃపురమందుఁ జేరి యవనికమూరిన్
వింతనుడులఁ గలఁచెనతం
డింతులసామాన్యపురుషు శేఁకువితానా. 111

క॥ సీగకఠినోక్తు లోర్వక
మాతనుగలపోయి ధరణి మార్గమొసంగెన్
నాతియునటుఁ జొచ్చెరసా
నేతయునెవ్వగను నీఁగెసిఖిలసుఖంబుల్. 112

క॥ కులధర్మంబులు దప్పిం
జేలువలు సేయందొడఁగిరి చీఁకటిపప్పుల్
దఃలువలచెడుపనులొప్పెన్
జలజాప్తకులాబ్ధివిధుని స్థానీయతమునన్. 113

క॥ జనపతము పాటు నెంచక
జననాథుఁడు కర్దమప్రజాపతిజామా
తృనియానుమతి సరయూనది
ననుజులతోనంతర్గుంకె హాదివగతివటన్. 114

క॥ సుడివాలుగాఁగ శత్రు
ఘ్నుఁడు శంఖముగా భరతుఁడు నూరుతలలదే
వ్రుఁడుగా లక్ష్మణుఁడలరెం
బుడమినొడయుఁ డాదివిష్ణుమూర్తిగఁదనరెన్. 115

క॥ శ్రీరామశస్త్రాంకురమ
యే రాధేయనంగఁబుట్టెఁ గృష్ణుండాయెన్
శ్రీరమణుండని రావణ
వైరి వరిగసూతుఁడా విప్రతిసంతతికిన్ 116

క॥ అలఘుతరభక్తి నియ్యది
యలరఁబఠించు సుజనాళి యఘసంఘంబుల్
దలఁగుదురు గౌడబ్రాహ్మణ
కులశేఖర దానధర్మగుణసత్యాకరా. 117

క॥ శ్రీమౌద్గల్య సగోత్రభ
వామంజులవాగ్విభవసువైభవజితపౌ
లోమీధవ విశ్రాణన
తామరసహితోద్భవ ధృతిదర్పితభావా. 118

క॥ శ్రీమల్లక్ష్మ్యంబాగ
ర్భాబ్ధ్యమృతకరకాన్తకావ్యాకర సుకవి
స్తోమస్తుత్య యశఃపటీర
కామక్రోధహరయాదవక్రమదకరా. 119

క॥ భావభవాకారయుతా
సావిత్ర్యంబాభిధాన సాధ్వీహృద్యా
శివమఖవ్రత ధీరత
శ్రీవేంకటరమణమూర్తి శ్రితజనవర్తి. 120

గద్య.

ఇది శ్రీకాళీచరణారవింద మరందపానధౌరేయ
రాజామణినామధేయ ప్రణీతము రామక
థాకరండము సర్వము సంపూర్ణము.



